లకును విభజించి యిసి తక్కినయది మొసఁగవలయును. దేవుని గురువును ధర్మంబును సేవించువాఁడు కుటిలమతి గాఁడు. మనోనిరోధము సర్వేంద్రియములను బంధింపఁ జేయును. పురుషులకు స్వతంత్రవృత్తి పరమౌషధము. స్వచ్ఛందచారులగు నేనుఁగులు కాననములందే రోగమును లేకుండ జీవించుచున్నవి కదా! సరసమగు స్వేచ్ఛాలాపమొకటియుఁ దాంబూలభక్షణమొకటియు నీరెండే సర్వకాలము సేవించుచున్నను సుఖముఁ గలుగఁజేయునవి. చిరకాల మెత్తగు ప్రదేశమున నిలుచున్నచో రక్తము ప్రవహించు నాడులు శిథిలములగును. చిరకాలము కూర్చున్నచో జఠరాగ్ని మందమగును. మనసు స్థూలమగును. వాక్కు ముద్దయగును. శరీరమునకు బొంద పెరుగును. శరీరమునకు విస్తారముగాఁ జెమ్మటపట్టించినచో శీఘ్రకాలములోనే ముదిమివచ్చును. దేవాగారములను దేవశూన్యములం జేయరాదు. దేవుఁడును గురుఁడును ధర్మము లేనివానియందుఁ బ్రత్యయముంచరాదు. క్లేశకర్మవిపాకాశయపరామృష్టుఁడు కాని పురుషవిశేషమె దేవుఁడు, అర్హన్, అజః, అనంతః, శంభుః, బుద్ధః, తమోంతక యను విశేషనామములా దేవునికే కలవు. ఆత్మసుఖమున కవరోధము కలుగకుండ ఱేఁబవళ్లు విభజించి సర్వకార్యములు నెరవేర్చుకొనుచుండవలెను. ఏకార్యమునకును కాలనియమము లేకుండరాదు. కాలనియమములేని కార్యము మరణసమానము. ఆత్యంతికకార్యములకుఁ గాలనియమము పనికిరాదు. అవశ్యకర్తవ్యమగు కార్యమునకుఁ గాలయాపన చేయరాదు. రా జాత్మరక్షణమునందెన్నండును నేమఱియుండరాదు. ప్రతిదినము సవత్సయగు ధేనువునకుం బ్రదక్షిణము జేయకుండ ధర్మాసనమెక్కరాదు. అధికారి గానివాఁడుగాని పిలువఁబడనివాఁడుగాని రాజసభకుఁ బోరాదు. ఆరాధనీయుఁడగు వానికెదురుగాఁబోయి నమస్కరింపవలయును. దేవగురు ధర్మకార్యములు స్వయముగాఁ జేయవలయును. కుహకులతోడను నాస్తికులతోడ సావాసము చేయరాదు. విలాసకౌతుకినియుఁ బాలికలకుఁ దాపకరంబగు పనిచేయరాదు. తల్లియైనను బరస్త్రీతో రహఃప్రదేశమందుండరాదు. ఎంతకోపమువచ్చినను మాన్యుల నవమానింపరాదు. వారిమాట నతిక్రమింపరాదు. శోధింపకుండఁ బరస్థానమునఁ బ్రవేశింపరాదు. కూర్చుండరాదు. అజ్ఞాతవస్తువుచే వాజీకరింపని వాహనాదికమెక్కరాదు. మంచిగాఁ బరీక్షింపకుండఁ దీర్థమునుగాని ఏకాకినిగాని సన్యాసినిగాని నమ్మరాదు. హెగ్గడికాండ్రచేఁ బరిశోధింపఁబడని మార్గమునం జనరాదు. విషనాశకంబగు మణినిగాని యౌషధింగాని సేవింపరాదు. విషవైద్యుని విద్యనెన్నఁడును గరంబునం దాల్పరాదు. మంత్రియు వైద్యుండును జ్యోతిష్కుఁడును లేకుండ నెన్నఁడును గొలువుచేయరాదు. తానుపయోగించు ప్రతిపదార్థమ్మును వహ్నియందు

## 26 (సదాచారసముద్దేశము.)

అతిలోభ మతివిశ్వాస మత్యనుగ్రహము నీమూటిచేతను బృహస్పతియంతవాడైనను వంచింపఁబడును. జాపఁబడును. బలవంతునితో విరోధ పడినవాడు దేశాంతరమునకు లేచిపోవలయును లేదా వానితో సంధిఁగావించుకోవలయును కాని యన్యథా క్షేమోపాయము లేదు. దేశాంతరమునకు లేచిపోయినవానికిఁ బౌరుష మెక్కడిది? తనస్వరూపము తెలియకుండ సంచరించినచో వాఁడు గొప్పవాఁడైనను దక్కువవాఁడే. ఆర్తులకు ధర్మబుద్ధి మెండుగ నుండును. ఎవ్వఁడు స్వయముగా ధర్మమందుఁ బ్రవర్తించునో వాఁడు నిరోగుండు. వ్యాధిగ్రస్తునకు దైన్యమునకంటె నెక్కువమందులేదు. ఎవ్వని జన్మము దురవావల పాలుగాదో వాఁడు మహాభాగ్యశాలి. మందమతులు క్రోధనంబులగు వస్తువులందు స్వోత్కర్ష వెలిఁబుచ్చుకొనుచుందురు. భయసమయంబులం దేడువక ధైర్యమవలంబింపవలయు. రణమునందును శరసంధానంబునందును వెనుకపడు నతఁడేటి ధానుష్కుఁడు. మరణమందును మనస్సంధానమందు ను వెనుకపడు నతఁడేటి తపస్వి. కృతికి ప్రతికృతి చేయనిచో నైహికాముష్మిక ఫలంబులు రెండునులేవు శత్రువువలననైనను మంచిమాట గ్రహింపనగు. కలహకారిత్వమున ప్రీతి చెడఁదీయుటయు దుర్మతుల ధర్మము కాని సజ్జన ధర్మము కాదు. ఎవఁడు లబ్ధమగు సంపద చేతనే సంతసించి మరలఁ దవ్విషయమై ప్రయత్నముఁ గావింపఁడో వానికి సిరి యభిముఖి కాదు. వైరానుబంధ మెప్పఁడుపశమింపఁజేయఁడో వానికి వంశవృద్ధి యెట్లగు. భీతుల కభయ దానము కన్నఁ బరమమగు దానములేదు ఉత్సాహము కామితార్థములను ఒసఁగుచుండును. అందఱికిని కల్పవృక్ష ప్రాయుఁడగు ప్రభువు తనయెడల వంధ్యుఁడగుటకుఁ గారణము తన దురదృష్టమో తన యపరాధమో యని తలంపవలె. ఎవఁడు మూలధనమును వృద్ధిపఱుపకుండ ననుభవించునో వాఁడత్యంత దుఃఖితుఁడగును మూర్ఖదుర్జన పతితుల తోడిసహవాస మెవ్వనికిని శ్రేయస్కరము కాదు పాండురోగమువలె నెవ్వని చిత్తానురాగము వ్యాపింపదో వాని సంతోష మితరులకు ఫలకారి కాదు. తన కొలఁది యెఱుంగకుండఁ బరాక్రమించినచో నెవ్వఁడు పరాభవముఁ జెందకుండు. పరభియోగమునకు శాంతియెన్నఁడును బ్రతిక్రియ కాదు ప్రత్యుపన్యాసమే ప్రతిక్రియ కాని అసమయకోప మెంతవిశ్వాసమున్నను పరిజనమునకు వైరస్యము కలుఁగఁజేయును. చచ్చినవారిపయి యేడ్వఁ జనదు. వారికిం దగిన యుత్తర క్రియలు జరుపఁదగు. అట్లు చేయక యేడ్చినచో కన్నీటి బిందువులె ప్రేతల హృదయంబుల కంగారంబులగు. నట్లేడ్చినచో వాఁడు

మకల బ్రతికి చేని దుఃఖింపవచ్చును. చిరకాలము శోకము హృదయమునం జేర్చుకొన్నచో నది ధర్మార్థ కామముల కుద్వాసన చెప్పును. తానుపడిద్రిం డయ్యు నెవ్వఁడు విషయములం దభిలాష పడునో వాఁడు కింపురుషుఁడు. అపరిచితులయెడఁ బ్రియపూర్వకానురాగముఁ గన్పఱచువారు దేవసమానులు. ఈలోకమున్నను శాశ్వతమగు కీర్తి సంపాదించినవారు మృతులయ్యును మృతులుకారు. ఎవని కీర్తి చేత భువనంబులు ధవళీకృతంబులు కావో వాఁడు భూభారమునకై జన్మించినవాఁడు. పరోపకార పారీణులకు శరణాగతుల!యెడఁ!బరీక్ష గనదు. అభిచారక్రియల వలనఁ బరాభిభూతి చేయుట మహాపాతకి లక్షణము. ఏరాజునకు విద్వాంసులయందుఁగాని విద్వత్సభలయందుఁగాని గుణగ్రహణ పాటవ్యముండదో వానికి విజయంబు నభ్యుదయంబును నెట్లు ఘటిల్లించును. పరోపద్రవంబును నష్టంబును జేయుట్రియుంట నుండదో తనకుటుంబము నామిత్రిఁయుంట సంరక్షింపవలయును. పరస్త్రీ పరద్రవ్యముల రక్షించుట వలన లాభములేమగాని వానికేదేని నష్టమువచ్చినచో గొప్ప యనర్థము మాత్రము కలదు. ఆత్మనురక్తునిఁ బరిత్యజింపరాదు. తనకున్నంతయే వానికిచ్చి సంతోషపఱుప వలయును. ఆత్మశ్లాఘయుఁ బరనిందయుఁ గల భృత్యుఁడున్నచో నెంతపనివారమున్న రాజైనను గొలది కాలములో నేకాకియగును. అపరాధమునకు తగినదండము స్వపుత్రియుఁడలపైనను చేయవలయును. పన్నదేశమునకుఁ దగినట్లు గ్రహింపవలయును. ప్రతిపత్తికిఁ దగినట్లు మాటాడవలయు. ఆదాయానుగుణముగా వ్యయము చేయవలయును. ఐశ్వర్యమహాపముగా వినానము జూపింపరాదు. నవోదయానుదయముగాఁ గార్యమారంభింపఁదగు. ధనమునకును శ్రేష్ఠమను దగిన త్యాగమొనరింపఁదగు. సంతోషియే సుఖి. రజస్వలాసంగముసు చేయువాఁడు చండాలునికంటె నధముఁడు. సిగ్గుపడఁదగు. కర్మము లజ్జాశూన్యముగాఁ జేయరాదు. ఎవనికి సచ్చరిత్ర యాభరణమై యుండదో వాఁడు దివ్యాంబరధారియయ్యును దిగంబరుఁడే. సచ్చారిత్రుఁడు దిగంబరుఁడయ్యు దివ్యాంబరధారియే. ప్రతివాదసందేహములు కలవానికిఁ గార్యసిద్ధి కాదు. మృత్యువులకంటె నధికమగు దిపాయసము లేదు. నిర్భాగ్యులకు పరోపకారమే వృత్తి. పరాధీనమగు భోజనముకన్న నుపవాసము మేలు. వర్ణసంకరము లేని దేశమందు నివసింపవలెను. ఎవఁడు పరలోకమును బరిగణింపఁడో వాఁడు పుట్టంధుండు. ప్రేమయు విద్యయు సత్యంబును వాక్సౌశీల్యంబును నలోభవాక్యంబులును దారిద్ర్యమును నిలుపవుగాని దారిద్ర్యమున శరణ్యము నిలుపదు. నిస్పృహులకుఁ బరాపేక్షయేటికి. అగాన్లోక మనాథవిందువారో పురుషుఁడా! ఎవనిచిత్తము శాంతముకాదో వాడే కృపాదుండు. ఎవనిది

ములం జూచుటకు గ్రుడ్డివారు. శత్రువైనను నింటికివచ్చినచో సత్కరింపవలయునన్నచో నీతులవిషయము చెప్పవలయునా !

తనయింటఁ దాఁచుకొన్న ధననిక్షేపముంబోలెఁ దనచేసిన ధర్మమును దాను ప్రకటింపరాదు. మదప్రమాదముల వలనఁ జేసినదోషమును గురువులకు దెలిపిన పిదప నే ప్రాయశ్చిత్తము. దేవగురు ద్విజాతిథులను శ్రీమంతులు కాయక్లేశపడి సత్కరింపఁజనదు. విభవానుసారముగ సత్కరింపజేసినం జాలును. నీచుల కువరమధ్య లాలన మొనరించినను శౌంగలకు బలె వికార మొనరింపకుండుట తటస్థింపదు. ప్రత్యుపకారాపేక్ష లేకుండ నెవ్వఁ డితరుల కుపకారమొనరించునో యతండు ధన్యుఁడు, తెలివిలేనివాని వైరాగ్యంబును సన్యాసివిటత్వంబును ఇంద్రియపాటవము లేని విలాసమును వేశ్యారతుని సదాచారంబును తెలిసికోదగిన వస్తువును తెలిసికోలేనివాని తత్త్వవిచారంబును మహాత్ములకు రత్నాలప్రాయంబులు, శస్త్రము లేనివానితోడను శాస్త్రము లేనివానితోడను నెవఁడెదిరించునో వాఁడు మహాపాతకి. ఉప్పుకొనుటకుఁ జండాలగృహంబునకు బోయినట్లే యొక్కొక్కప్పుడు కార్యసిద్ధికై నీచులను సైతమాశ్రయింపవలయును. కార్యార్థి పరదోషము నబిగణింపఁడు. గృహదాసీసంగమము గృహమును గృహిణిని గృహపతినిం గూడ నశింపఁజేయును. వేశ్యాపరిగ్రహము దేవద్విజ బాంధవుల కుచ్చాటనము, ఔర లోకుల పాపము. తనభార్య రతీదేవి వంటిదయినను కటువగుచున్నది. పరకీయ కుక్కవంటిదైనను రంభయగుచున్నది. ఒక్కదానిని పెండ్లాడినవాఁడే సుఖి. స్త్రీవ్యసనికైనను, నభిసారికల యందున్నంత సుఖము వేశ్యల యందు లేదు. వేశ్యలయందలి వ్యసనమున ధనమా! పోవును దైన్యమా! తటస్థించును దాని యిచ్చవచ్చినట్లు తిరుగుటా సంప్రాప్తమగును, అస్థిరధనము, కంటి ఆవు, గాడిద, పెండ్లికూడిన పెండ్లము. ఏపనిఁజెప్పినను చెయ్యఁదియక సేయు పరిచారకుఁడును నెవ్వనికి సుఖము సేయవు. యతి నృపతి వేశ్య! చారుఁడు భాండసుఁడుఁ వీరిటికి వచ్చుట నష్టమునకేగాని లాభమునకు గాదు. లుబ్ధునకెన్ని సుగుణము లున్నను వ్యర్థములు. ఫలింపని యాచ్ఞాదైన్య మెందులకు. దారిద్ర్యముకంటె లాఘవకారిలేదు. దానివలన మహత్త్వముగూడ శంకనీయ మగుచున్నది. తినయభిలషితము నెరవేఱకున్నను ధనవంతునిం గుణించి లోకము సంతోషించుచుండు, రత్నహిరణ్యపూతమగు జలముకంటె శుద్ధిచేయు పదార్థము లేదు. బందీమోచనము దీనపరిపాలనము కలయుత్సవమే యుత్సవము. అతిథులకును బరిజనులకును మృష్టాన్నమిడిన దినములే పండుగ దినములు. అధర్మ కార్యములు సేయక ధర్మకార్యములు చేసిన తిథులే తిథులు. అకృత్యములు చేయని తీర్థయాత్రయే తీర్థయాత్ర వయోవిద్యోచితమగు సమాస్థానము సేయించు

పాండిత్యమే పాండిత్యము. ఇతరులకు నాశ్రితగులకుండఁ దనకార్యమును దానే చేసుకొను చేయుటే చేయుట. సర్వజనసమ్మతంబగు లౌకికజ్ఞానమే లౌకికజ్ఞానము. పరుషోక్తి యుఁ బరోద్వేగంబును లేని వాచాలత్వమే వాచాలత్వము. యౌవనదోషంబున నపవాదకెందని ధైర్యమే ధైర్యము. ఆదానము పరవశీకరణముగల సౌభాగ్యమే సౌభాగ్యము. విద్వాంసులులేనిసభ మహారణ్యముగాని సభకాదు లోకమందెవ్వనికి నిష్టముగానితనయి ష్టమెంచునుకు. పరసంబంధము సహింపనిరాజు మహాశ్లాఘ్యుఁడు. వ్రాఁతకంటె మాట ప్రమాణమైనది కాదు. తెలియని వారియందు విశ్వాసముంచఁజనదు. స్వామిద్రోహము, స్త్రీహత్య శిశుహత్య, ననుమూఁడు మహాపాతకములకు ఫలము తత్కాలమునందే సంభవించును. దుర్బలునకుఁ బలవంతునితో విగ్రహము తెప్పలేకుండ సముద్రములో దిగుటవంటిది. బలవంతునియొద్ద వికృతిసేయుటకంటె మరణకారణములేదు. ప్రవాసము చరిత్ర వస్తులకేని సంతాపకరము. చాలవారి బత్తెము. మతికనుకూలమగు పరిజనము మాత్రియు సువిహితంబులు సాధనంబు కలప్రవాసి విదేశంబులందెంత మాత్రము దుఃఖపడఁడు.

## 28 వివాదసముద్దేశము.

రాజు గుణదోషములకుఁ ద్రాసుకఱ్ఱవంటివాఁడు. సమస్తమనుజులకును గుణదోషములే గౌరవమును లాఘవమును దెచ్చునవి. రాజధికారులయెడల సమపక్షులైనవారో సత్ఫలమనుభవింతురు ఆత్మునివలె యథావస్థితమగు సర్థమును ప్రకటించువారు సభ్యులు. వ్యవహారముఁ జూడనివారును విననివారును ప్రత్యర్థులను లంచము నపేక్షించువారును సభ్యులు కాఁజనదు. లోభపక్షపాతములవలన యథార్థమును మఱుగుపఱచు సభ్యులును సభాపతియును మానహానియు ద్రవ్యహానియు నొందుదురు. సభాపతి తన శత్రువగుచోట సవానమే పనికిరాదు సభ్యులకును సభాపతికిని తిన్నని బుద్ధిలేనిచో జయమెట్లుఘటించును. వివాదమొనరించి సభకురకుండుట పిలిపించినఁ రాఁపోవుట మొదటిమాట తరువాతిమాటను బాధించుట పరోక్తులకు నిరుత్తరుండగుట యుక్తియుక్తమగు మాట నంగీకరింపకుండుట స్వదోషమును గప్పిపుచ్చుట పరదోషము లుదాహరించుట యథార్థవాదమందు నుపేక్షించుట మొదలగునవి సభాపతిపరాజితులకుఁ జిహ్నములు. సాక్ష్యముకంటె భుక్తము, పత్రముకంటె సాక్ష్యమును ప్రబలమైనది. భుక్తమనగా ద్వాదశసంవత్సరపరిమితము. ఆక్షేపముగల భుక్తంబును సత్సాక్ష్యమును కూటలిఖితమగు పత్రంబును వివాదము తీర్చుటకుఁ జాలవు. బలాత్కారముగను నన్యాయముగను రాజులమునను జేసినది ప్రమాణముకాదు. వేశ్యయుఁ గితవుం

దును. చెప్పిన సాక్ష్యము గ్రంథానుసారముగను కాలానుసారముగను బరికించి నమ్మవలయును. అసత్యరూపమగు వ్యవహారమునకు విచారణమె యనవసరము. ధనన్యాసవిషయకమగు వివాదము పురుషునియందలి ప్రామాణ్యము ననుసరించి నిర్ణయింపవలెను. లేదేని దివ్యప్రమాణవచనముల నిర్ణయింపఁదగు. గౌరవమర్యాదలు లేనిసాక్షి దివ్యప్రమాణవచనములును నమ్మరాదు వాదిప్రతివాదులుభయులకును నమ్మకుఁడగు సాక్షి ప్రమాణవాక్యములు నమ్మవచ్చును. విటులయు లింగులయు నాస్తికులయు దురాచారులయు దైలికప్రమాణ వాక్యములు నమ్మరాదు. వారిసాక్ష్యము కార్యసిద్ధికిఁ గార్యసిద్ధికిని గూడఁ బనికిరాదు. ప్రతిజ్ఞోక్తులను ముఖోక్తులనుఁ బరికించి తీర్పుచెప్పవలెను. పరవిప్రలాపమున్నచో యుగాంతరములకైనను వివాదసమాప్తి కాదు. సభలోఁ భూమిపైఁ గూర్చుండరాదు. సాక్షులన్యోన్యము మాటలాడుకోరాదు. జానపద పౌరవ్యవహారముల యెడల వివాదము కలిగిన రాజావలననే తీర్పుఁజేయింపవలెను. రాజపరీక్షితమగు దానియందు దోషముండదు. రాజశాసనమును రాజమర్యాదను నతిక్రమించినవానికి సర్వస్వహరణ ఫలంబగు దండనము విధింపవలెను. దుర్మార్గులకు దండనేతరమగు నివారణోపాయములేదు. కపటపంకర ప్రాయ్యమై తీర్పును. దరిద్రులెల్లరును బరాధవింతురు. నరకమగు దారువు చీల్పఁబడినట్లు వక్రదారువు చీల్పఁబడదు. అపరాధులను క్షమించుట సమర్థునకుఁ దప్పకాదు కాని తన్నాదరించినవానిని క్షమించుట యనమర్థత్వ మనిపించుకొనును. దుష్టస్వాంత్యముగల రాజులఁజూచిన బాములఁజూచినట్లు జనులు భయపడుదురు. బహునాయకము ననాయకము నగుసభఁ జేరరాదు. పరప్రవేశముగల గోష్ఠి తలఁపరాదు. స్వనిందా పరిహార మాత్రమే సజ్జనులకుఁ బరనింద. ప్రతిభా ముఖంబునను రాజస్తుతి యనవసరము

అర్థసంబంధము గాని దుస్సహవాసము గాని కలహముగాని యాకస్మికార్థలాభము గాని ప్రాణములతో పాటుసంపాదించిన పూర్వార్జిత ద్రవ్యమునుగూడ నశింపఁజేయును. బ్రాహ్మణులు హిరణ్యముగాని జన్నిదముగా స్పృశించియు క్షత్రియులు శస్త్రములనుగాని, రత్నములనుగాని, భూములనుగాని, వాహనములనుగాని, జీనులనుగాని, స్పృశించియు. గోమట్లు ధనగోపన స్థానమునుగాని, బిల్లవానింగాని, కాకిణి హిరణ్యములనుగాని, మఱియు శూద్రులు పాలుగాని, విత్తులుగాని. పుట్టలుగాని, తాకియు శిల్పులెవ్వరే క్రియవలన జీవింతురో తత్క్రియా సాధనములను స్పృశించియు యతులిష్ట దేవతాపాదములు స్పృశించియుఁ జేసినశపథము దివ్యశపథ మనఁబడును. కోశము తంతులములును దులాదండములను స్పృశించి చేయు శపథంబు దివ్యంబునాఁ

బడు. అన్త్యజులచే తడితోలుమీఁద నెక్కించి శపథముఁ జేయింపవలెను. కిరాతుల
చే వింటిబద్దను దాటించుటయే దైవిక ప్రమాణము, ఉంచుకొన్న లంజె సానియు గోప
కీలుండగు పరిచారకుఁడును దనవానియొద్ద నుద్యోగంబును నియోగిమైత్రియు శాశ్వతం
బులుకావు. అన్న విక్రేత యింటి యాహారమునకుంబలె లంజెసానులయందభిరుచి రుచి
శూన్యము. ఎవ్వఁడేవస్తువు నెంతప్రేమించునో వానికిదానివలన నంతపరితాపంబును గల
దు. రాజునకేనుగంతో చాకలివానికి గాడిదయునంతే. మూర్ఖునకుఁ గలిగిన యాగ్రహ
ముపాయముచేఁ దీరకుండ మరలదు. మూర్ఖునకు శాంతోపదేశము దూదికగ్నివంటిది. మూ
ర్ఖునకు శిక్ష్యోపపత్తి గలుగుట యుద్దీపన దండమువంటిది. మండుచున్న క్రోధాగ్నికి శాం
తవచనంబు లింధనంబులు గాని జలంబులు కావు. అంధుఁ డంధులను గొంతఁ ద్రోచినట్లు మూ
ఢసహవాసము మాఢ్యముంబెంచును స్వభావనిర్గుణంబగు వస్తువునందుఁ బక్షపాతమున
నెంతమంది గుణవర్ణనచేసినను గుణవత్త్వము రాదు. మేక మెడ చన్నులనుండి పాలెవ్వఁ
డు పితుకఁగలఁడు.

## 29 షాడ్గుణ్య సముద్దేశము.

సమవ్యాయామములు యోగక్షేమములకుఁ గారణములు. కర్మప్రారంభముల
కుపాయాన్వేషణమే వ్యాయామమనంబడు. కర్మఫలప్రాప్తి విషయమయి యుపా
యాన్వేషణము క్షేమసాధనంబగు శమమనంబడు. దైవంబును మనుష్యప్రయత్నంబు
నుఁగలసి కార్యసిద్ధికి మూలంబులు. దైవమన ధర్మాధర్మములు. మానుషప్రయత్నము చిం
త్యము. దైవమచింత్యము. తలపకుండ సంప్రాప్తించిన యర్థానర్థములు దైవాయత్తము
లు. బుద్ధిపూర్వకమగు హితప్రాప్తియు నహితపరిహారంబును మానుషాయత్తంబులు. మ
నుష్యప్రయత్నలభ్యములయందును దైవాయత్తత లేకపోలేదు. దైవమున్నను మనుష్య
ప్రయత్నములేకున్న భద్రములేదు. దైవాయత్తమని యూరకున్నచో వి ల్లంబులతో
డుగువా! ప్రయత్నముఁజేయు వాని కర్థానర్థప్రాప్తియందు సందేహముగాని దైవము
మీఁదనే భారముంచి ప్రయత్నముఁజేయనివానికి మాత్రమనర్థమే తటస్థించును. ఔ
షధమున కాయుష్యమునకుంబోలె దైవపౌరుషములకు బరస్పరసంబంధముకలదు. ఆసం
బంధమే కార్యసిద్ధిసాధనము. యోగక్షేమముల నిష్పత్త్యుపాయమే నీతియనఁబడు. దు
ర్నీతి విపత్తునకు హేతువు, త్రిమూర్తి స్వరూపుఁడగు రాజుకంటెఁ బరమగు దైవ
ములేదు, బ్రహ్మచర్యాశ్రమమవలంబించి పరబ్రహ్మమునందు నిష్ఠాతబుద్ధియై గురుకు
లము నాశ్రయించి తెన్నగా విద్యలు సంగ్రహించి కౌమారము నాశ్రయించిన రాజపు
త్రుఁడు బ్రహ్మయగును. రాజ్యలక్ష్మీపట్టాభిషేకముఁ జెంది తనగుణములవలన ప్రజా

నురాగముఁ గలుగఁజేసికొను రాజు నారాయణమూర్తి యనఁబడు. "సాక్షాత్పృథ్వీపతిః" యను వచనమితనియందే వర్తించును. ప్రతాపమను తృతీయలోచనము నవలంబించి పరమైశ్వర్యముతో రాష్ట్రకంటకులగు నసురులను శత్రువులను దానవులను జయింపఁ దలఁచిన విజిగీషువగు రాజు పరమేశ్వరమూర్తి నాఁబడు. ఉదాసీనుఁడు మధ్యముఁడు విజిగీషువు, అమిత్రుఁడు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందుఁడు, ఆసారుఁడు, అంతర్ధి యను వారు మండలాధిష్ఠాతలగు రాజులు. వీరికిఁగల లక్షణములు వేఱు. విజిగీషు మండలమునకు ముందును వెనుకను బ్రక్కను గోణములయందును గల మండలమందుండియు నిగ్రహించిన మధ్యమాదుల నిగ్రహించుటయందును గలసివచ్చినవారి ననుగ్రహించుటయందును సమర్థుఁడై యుండియు గారణాంతరమున విజిగీషులై యితరులు వచ్చినను నుదాసీనభావముచే నుండువా డుదాసీనుఁడు నాఁబడు. ఉదాసీనుని వలె నేవ్రక్క మండలమునందుండియుఁ దాను విజిగీషువుకంటె నధికబల సమన్వితుఁడయ్యు నొకానొక కారణమున మాధ్యస్థ్యము వహించియుండువాఁడు మధ్యస్థుఁడు నాఁబడు. రాజ్యము పురుషకారము దైవబలము. ద్రవ్యము చతురంగబలము. నీతివిక్రమములను గలవాఁడు, విజిగీషువనంబడు. విజిగీషువున కహితమగు కార్యముఁ జేయుచు బ్రతికూలుఁడగువాఁడే యమిత్రుఁడు. మిత్రలక్షణమింతకుమున్నే వివరింపఁబడినది. విజిగీషువు దాడివెడలనున్నప్పుడుగాని వెడలినపిమ్మటఁగాని కోపమును బుట్టించువాఁడు పార్ష్ణిగ్రాహుఁడు. విజిగీషునకుఁ దరువాతిశత్రు వాక్రందుఁడు. పార్ష్ణిగ్రాహాక్రందుల కమిత్రుం డాసారుండు. అరివిజిగీషువుల మండలములకు మధ్యస్థంబగు మండలమునందుండి యుభయులచే జీతముఁగొనువాఁడంతర్ధి యనఁబడుచుఁ బర్వతాటవ్యాదుల నాశ్రయించియుండు. లుబ్ధుఁడును క్షుద్రుఁడును విరక్తులగు ప్రకృతులు గలవాఁడును నననుగుణస్వభావము గలవాఁడును నన్యాయశీలుఁడును వ్యసనమగ్నుఁడును బ్రతికూలమిత్రామాత్యమంత్రిసేనాపతి సామంతాదులు గలవాఁడునువగు శత్రువుపై దాడివెడలనగు. అరి ఆశ్రయశూన్యుఁడై యున్నప్పుడును దుర్బలాశ్రయుఁడై యున్నప్పుడును నుచ్ఛేదనీయుఁడు గర్షణీయుఁడును బీడనీయుఁడును నగు. సహాభిజనుండును సహజశత్రువిరుద్ధములగు లక్షణములు గలవాఁడును విరోధయితయు నగువాఁడు కృత్రిమశత్రువు. శత్రువునకుఁ దరువాతివాఁడు మిత్రుఁడే కాని యామిత్రత్వము శాశ్వతము కాదు. అవసరమే మిత్రత్వామిత్రత్వములకుఁ గారణములుగాని యాంతర్యానంతర్యములు కావు. బుద్ధిబలము మంత్రశక్తి యనఁబడు. శివులకిల్లి సింహమును జంపుటయే బుద్ధిబలమునకు దృష్టాం

తము. ప్రభుశక్తి యనఁ గోశదండబలంబులు. దీనికి శూద్రకమహారాజును శక్తికుమా
రుండును నిదర్శనములు. ఉత్సాహశక్తి యనఁ బ్రారంభించినకార్యమునకై విక్రమబలం
బున వెనుదీయకుండుట. దీనికి రాముఁడు దృష్టాంతము. అభివృద్ధనగు శక్తిత్రయసంప
దకలవాఁడు గొప్పవాఁడు. బలవంతుఁడు, శక్తిత్రయహీనుఁడు హీనుఁడు. సమానశక్తి
త్రయసంపద కలవారు సమానులు. సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయము
లు షడ్గుణములు. అందుఁ బణబంధమే సంధి. అపకారము విగ్రహము. దాడివెడలుట
యానము. ఉపేక్షయే యాసనము. శరణుఁజొచ్చుట సమాశ్రయము. ఒకనితో సంధి
చేయుచు రెండవవానితో విగ్రహించుట గాని యొకనితోడనే సంధి సేయుచు
విగ్రహించుట గాని ద్వైధీభావము. హీయమానమగు పణబంధము కలవానితో సం
ధిచేయఁదగు. వాఁడు పరిణతంబగు సర్గంబున మర్యాదోల్లంఘనము సేయఁడేని వానితో
సంధి యుచితము. అతిస్పృద్ధమదయుంబునందాత్మసంక్షోభము లేదేని విగ్రహింపనగు.
నన్నితరుఁడు జయింపలేఁడు నేనితరులను జయింపలేను నవస్థయం దుత్తరకాలమునం గా
కలుషున్నచో నాసనముచితము. రాష్ట్రకంటకులు లేకున్నను పశ్చాత్ప్రకోపము లేకున్నను
గుణాతిశాయియే సర్వాతిశాయి. తనమండలమును రక్షింపకుండఁ బరమండలముపై దా
డివెడలుట బట్టకట్టుకొనక తలపాగ పెట్టుటవంటిది. గ్రీష్మవాసికిఁ గాలిసంకెలవంటిది.
శక్తిహీనుఁడు బలవానాశ్రయింపఁదగు. బలవంతునకు భయపడి దుర్బలు నాశ్రయిం
చుట యేనుఁగువలని భయమున నాముదపుచెట్టెక్కుటవంటిది. అస్థిరుం డస్థిరు నాశ్ర
యించుట నదిలోఁబడి కొట్టుకొనిపోవువాని నింకొకఁడు కొట్టుకొనిపోవువా డాశ్రయిం
చుటవంటిది. మానికపమానముకంటె మరణము మేలు. పరు లిచ్చినచ్చినట్లు తినుచు
కాళ్ళ విక్రయమును చేసికొనుట మేలుగాదు. ముందు మంచిదశ రాఁబోవునని యొ
జిఁగినప్పుడేదియో యొకసంబంధమున నొరుని సమాశ్రయించుట యుక్తము. రాజకా
ర్యములకుఁ గాలనియమము లేదు. రాజకార్యములు మేఘములవలె బయలుదేరుచుండును.
ఉదాసీనాదులయెడలఁ గాని శత్రువులయెడలఁ గాని సంధివిగ్రహములకంటె ద్వైధీ
భావమేమంచిది. యిద్దరు బలవంతుల నడుమనున్న శత్రువు రెండుసింగములనడుమ
నున్న యేనుఁగువలె సుఖసాధ్యుడగును. తనరాజ్యము సమర్పించుటకంటెఁ బన్నిచ్చు
చుండి రాజ్యము తనయధీనమందుంచుకొనుట మంచిది. పన్నిచ్చుట యనిత్యము. పో
యినచో రాజ్యము మరలరాదు. బుద్ధిపూర్వకముగా విత్తుండినను భూమ్యాశ్రయము
చేసిన విత్తు మొలచి చెట్టై పెరుగుచుండ. భూమిని బరిత్యజింపని రాజేల పెరుగఁడు
ఉపాయమూలముగా విక్రయించుచుఁ బ్రకృతిమండలమును ననురాగముతోఁ బెంచు

గా నల్పదేశముకలవాఁడైనను కొఁదికాలములో సార్వభౌముండగును. ఎవ్వనికి భూమి కులపాలిక కాదు. వీరభోజ్యవసుంధర. సామదానభేదదండములని నాలుగుపాయములు. గుణకీర్తనమనియు సంబంధోపస్థానమనియుఁ బరస్పరోపకార ప్రదర్శనమనియు నాయతిప్రదానమనియు నాత్మోపసంధానమనియు సామము పంచవిధము. నాద్రవ్యమంతయు నీది నేను నీవాఁడను నేను నీయిచ్చవచ్చినట్లు వర్తింతును అని తనయాత్మను సమర్పించుట యాత్మోపసర్పణ మనిపించుకొను. చాలధనమునుఁ గాపాడుకొనుటకై యల్పద్రవ్యము నొసఁగి సమాధానపఱచుకొనుట దానమనఁబడు. విషాదిప్రయోగంబుల వలననుఁ గుశాగ్రబుద్ధిగల గూఢచారులను శత్రుసైనికులఁ గాఁజేసియు శత్రుపక్షమువారి కన్యోన్యకలహజననంబగు క్రియఁ గావించుటయే భేదము. చంపుట బాధించుటయు ద్రవ్యము హరించుటయు దండమనంబడు. శత్రుసమీపమునుండి వచ్చినవానిం జక్కఁగాఁ బరీక్షింపవలయు. మంచిబుద్ధికలవాని ననుగ్రహింపవలయు. అరణ్యమందుఁ బుట్టినను నౌషధము క్షేమకారియేగదా! గడ్డగూబవలె నల్పజంతువైనను శత్రుసంబంధియగు జంతువు గృహప్రవేశముఁ గావించెనేని దంత్రియును బాధచేయును. మిత్రహిరణ్యభూమిలాభములలో నొకటికంటె నొకటి యెక్కువది. భూలాభమువలన హిరణ్యలాభంబును హిరణ్యమువలన మిత్రలాభంబును గలుగును. తా ననమర్థుఁడైనయెడల హిరణ్యభూమిలాభములకంటె మిత్రలాభమె గొప్పది. ఒక్కొక్కతఱి భూమికంటెను మిత్రునికంటెను హిరణ్యమె గొప్పదగును. శత్రువునితో మైత్రి చేయవలసిన యెడ వాని నచిరపతనుఁడునట్లుగాఁ జేయవలెను. సిద్ధార్థమున గూఢోపాయమున సవరణముఁ జేయఁజాలరేని సర్వశంకాదురపవాదము లటస్థించును. దుర్జనునకథముపరిహాసముఁ గావించియు మాన్యులచే నుపదేశముఁ జేయించియు నుపశమింపఁజేయవలెను. శత్రునీచకులకు గూఢముగఁ దానము జీతములిచ్చుచు స్వాధీనపఱచుకొనవలెను. శత్రువుల దాయాదులకు భూమియిచ్చి లోఁబఱచుకొనవలెను. ఒకనిభూమి యింకొక్కనికి నమ్ముటకు గొప్పప్రయత్నము కావలెను. సత్యమగు శపథము వా విశ్వాసజనకము. ప్రధానపురుషాది నిగ్రహమునకును హేతువగును. అనర్థములు సూచ్యగ్రములవంటివి. సూచీముఖమున పెద్దదారముఁగూడఁ బ్రవేశించును. క్షయమనఁగాఁ బుణ్యపురుషనాశమే. హిరణ్యధాన్యాదినాశము వ్యయము. స్వామిద్రోహము కాకుండునట్లుగాఁ దగిన లాభ మపేక్షింపవచ్చును. రాబోవు నర్థమునకుఁ గాలహరణముఁ జేయరాదు. ఎన్నఁడు ద్రవ్యము దొరకునో యని సర్వశుభగ్రహనక్షత్రశుద్ధమగు కాలము గడచువరకు నేగడచునుంచినట్లు ద్రవ్యముచేకనే ద్రవ్యమార్జింపవలెను. బుద్ధిహీను

మంబులు ఏప్రాయజానకుఁ జాలవు. పెక్కుమంది కలసి తనకపకారముఁ జేయఁదలఁచినను వారందఱికిని నొక్కసారి దండను విధింపరాదు అప్పుడప్పుడొక్కొక్కనికి శిక్ష విధింపవలయును. నూర్గురి నొక్కసారి చంపరాదు వేయిమంది నొక్కసారి దండింపరాదు. ఏభూమియందు రాక్షసకృత్యములు జరుగవో యాభూమి రాజస్వామి. బ్రిభుష్పం దోనుశోధన ముత్తరకాలావరోధకము కాదేనిఁ జేయఁదగు ఉత్తరకాలార్థసంబంధము గల యార్థ మనర్థమే కాదు. భూతభవిష్యద్వర్తమానకాల సంబంధమువలన లాభము త్రివిధంబు నాఁబడు.

## 30 వివాహసముద్దేశము.

పండ్రెండు సంవత్సరముల పెండ్లికూతురు పదియారువత్సరముల పెండ్లికొడుకును వివాహమునకు యోగ్యులు. ఇరువురును లోకవ్యవహారయోగ్యులు కావలయును. వివాహపూర్వకంబగు వ్యవహారము నాల్గుజాతులవారికిని సాంకర్యాభావమునఁ గులీనత్వమును సంపాదించును. ముందు మాటలు జరుగుటయుఁ బిదప నగ్నిదేవద్విజసాక్షికముగా యథావిధి పాణిగ్రహణమె వివాహమనంబడు. తల్లిదండ్రులు మొదలగువారు కన్యను యథాశక్తి నలంకరించి దానపూర్వకముగా వరునకిచ్చిన వివాహము బ్రాహ్మమనంబడు. "నీవు యావజ్జీవమీమహాభాగమునకు సహధర్మచారిణివి కమ్ము" అనినియోగించి కన్యాప్రదానము చేసిన పెండ్లి ప్రాజాపత్యమనంబడు. గోమిథునమును గట్నమిచ్చి చేసిన పెండ్లి యార్షము. ఋత్విజునకు యాగదక్షిణగాఁ గన్యనిచ్చినవివాహము దైవము. ఈనాలుగువివాహములును ధర్మ్యములు. తల్లిదండ్రులయు లేక బంధువులయు ప్రామాణ్యము కలిమిఁ బరస్పరానురాగపూర్వకముగా నన్యోన్యసమయపూర్వకముగా వధూవరులే చేసికొన్న పెండ్లి గాంధర్వము. ధనమునఁ బందెముగాఁ గన్యకనొడ్డిన పెండ్లి యాసురము, బలాత్కారకన్యాహరణము రాక్షసము. సుప్తమత్త కన్యాహరణము పైశాచికము. ఈనాలుగువివాహములు నధర్మములు కాని యధర్మ్యములు కావు. వర్ణభేదంబున వానికిని నంగీకారము కలదు. వధూవరుల కిరువురకును శుభలక్షణములు. శుభప్రదములు కనీనికలయందు లోమములును సన్నవిపిక్కలును వంకరతొడలును, కటినాభిజఠరము కుచములు శిరము వీనియందు శుభలక్షణములు లేమియు భుజంబుల నలుపు నుతొరుజిహ్వాధరంబులయందారుపచ్చని రంగును యెచ్చుతగ్గుదంతములును గండములయందు గోఁతులును చెవుల కచ్చుతగ్గును. అతిలఘుత్వాధిక వమాధిక కుబ్జవామనత్వ కారాంగత్వంబును. నసమానజన్మదేహత్వము ననునివి కన్యాదోషంబులు. కన్యకంజాచు

కోలుసవరుఁడుగాని దూతగాని వరబంధువులుగాని తాతాత్తుగ గన్యాప్రదానమునకుఁ బోవు నప్పటికి కన్యస్నానము చేయుచున్నచో రోగగ్రస్తురాలగును. ఏడ్చుచున్నచో మగనిం జంపును. నిదురఁబోవుచున్న నల్పాయుష్కురాలగును. విచారించుచున్న దుఃఖితయగు. ఇంటలేకున్న లంజయగు. కలహించుచున్నఁ బరిజనద్వేషిని యగు. అకృష్ణవర్ణన యతి కనిష్టురాలగు. కావున నట్టికన్యను బెండ్లియాడరాదు. పాణిగ్రహణ కాలంబునఁ బాణి శిథిలమైనచో వరునిఁ గన్య పరిభవించును. వరుఁడు తన మొగమువంకఁ జూడకున్నప్పుడు వికాసితలోచనయై వరునింజూచు కన్యక ప్రచండయగును. ఏకశయ్యయందున్నతజీ లాలింపని వరుని స్త్రీ పశువుగఁ దలఁచును. లాలింపకుండ బలాత్కారగ్రహణము గావించినచో స్త్రీ యాజన్మవిద్వేషిణి యగు. ధైర్యముఁ జాతుర్యము లేనివాఁడు కన్యకను బొందనేరఁడు. సమానమగు కులీనత సమమగు నైశ్వర్యము భిన్నమగు గోత్రము కల వధూవరులకే వివాహసంబంధము న్యాయము. కన్య తనతండ్రికంటె నధికైశ్వర్యవంతుండగు మగని గణింపదు. దరిద్రుని కన్యకను భాగ్యవంతుండగు వరుండును బరిగణింపఁడు. వారి కన్యోన్యానురాగము కుదురదు. దరిద్రునకు గొప్పవానితో సంబంధము వ్యయకారణ మవజ్ఞాకారణ మసంతుష్టికారణమునగును బరిణమించును. అవిశుద్ధకన్యాపరిగ్రహముకంటె వేశ్యనుంచుకొనుట మంచిది. అట్టికన్యక జన్మమే గర్హణీయమగును. ధనవంతుఁడు లోభియైనచోఁ బరిచారకులేమిచేయుదురు. మామిడిచెట్టు పండియున్నను వాకిలిఁగొన్న చిలుకలేమిసేయఁగలవు. తెల్పఁగా వరింపఁబడినదయ్యుఁ బాణిగ్రహణము కాకున్నంతవఱకుఁ గులీనతాసంకరము కలిగినచో నాకన్యను వివాహమాడక విడువవచ్చును. అనులోమ్యముగా బ్రాహ్మణులకు నాల్గుజాతుల కన్యలును క్షత్రియునకు మూడుజాతుల కన్యలను కోమటికి రెండుజాతులవారును వివాహయోగ్యులు. మాతులకన్యావివాహము దేశకాలముల నపేక్షించియున్నది. అవిఛిన్నమగు సంతానము. అనురాగము గృహవార్తలందుఁ జెప్పినట్లు వినుట. వంశమునకును జాతికిని దగినయాచారము దేవద్విజాతిథిసత్కారము చేయుట బాంధవులకు కార్యములే దారసంగ్రహమునకు ఫలములు. కావుననే పెద్దలు "గృహిణీ గృహముచ్యతే" అన్నారు. గృహమన గృహిణియేకాని తలుపులు ద్వారబంధములు దూలములు మొదలగు కాష్ఠసమూహము గృహముకాదు. గృహకృత్యములు చక్కఁగా నెరవేర్చుకొనుట. అసంతృప్తియును కాకుండఁ బదార్థములు వాడుట గృహకృత్యములయందుఁ దప్పఁ దక్కినవ్యవహారములయందు స్వాతంత్ర్యములేక యుండుట సదాచారము. తల్లివంటి స్త్రీలతోఁగూడ నంతఃపురమునందుండుట యనునవి స్త్రీరక్షణోపాయములు. వేశ్యలు

సర్వసామాన్యలు. వారితో నభిజాతుండు రమింపఁడు. ఇచ్చినకొలఁదిఁ బ్రేమఁజేయుట సత్కరించినకొలఁదిఁ బరోపభోగ్యలగుట. శక్తిలేనిచోఁ బరిభవించుట లేక చంపుట. ఎంతయుపకారముఁజేసినను నాత్మప్రియురాలు కాకుండుట. ఒకగడియ యేమఱియున్నను నాగడియలో బరునితో సంగమించుట మొదలగునవి వేశ్యాస్త్రీలకుఁ గలాంతములగు ధర్మములు.

## 31 ప్రకీర్ణకసముద్దేశము.

ఇఁకఁ బ్రకీర్ణకసముద్దేశముం జెప్పుచున్నాను. సముద్రమువలెఁ బ్రకీర్ణములగు సూక్తిరత్నముల నిండుఁ గొన్నుటచే నిదిరత్నామంబునం బరగుచుండె. వర్ణపద వాక్య ప్రమాణయోగ విజ్ఞాన గౌరవ మెఱింగిన సుమతియు సుముఖుండును సువ్యక్త గంభీర మధురధ్వనియుఁ బ్రగల్భుండును బ్రతిభాశాలియు నూహాపోహశాలియు నవధారణాగమన కుశలుఁడును సత్వరముగ వ్రాయుటయుఁ జదువుటయు నేర్చినవాఁడును సంక్షిప్తగ్రాహక లక్షణములు కలవాఁడగును. కథావిచ్ఛేదంబును దొందరపాటును ముఖవైరస్యంబును ననవేక్షణంబును స్థానత్యాగంబును జక్కఁగఁ జేయఁబడినదానియందు గూడ దోషోద్ఘాటనంబును, మౌనంబును నసహనంబును గాలయాపనంబును నాకాదర్శనంబును, ననత్యాలాపంబును విరక్తలక్షణంబులు. దూరావేక్షణంబును ముఖప్రసాదంబును బ్రశ్నలయం దాదరంబును, ప్రియవస్తువులను స్మరించుటయు, పరోక్షమందు గుణగ్రహణముఁ జేయుటయు, తత్పరివారమును శ్లాఘించుటయు దదనురక్తియు ననురక్తలక్షణములు, చెవులకింపును బాగ్యవిరుద్ధముగాని యర్థాతిశయంబును, శుభవాక్యరస సంపన్నతయు, నన్యూనాధిక వచనపద్ధతియు, ననన్వయ విరుద్ధత్వంబును ననునవి కావ్యగుణములు. అతి పరుషవర్ణ విన్యాసంబును నహిత యతియు ననన్వితార్థంబును నబోధపదోపన్యాసంబును నభీప్సితాభిధానాతిశయాన్యూనత్వంబులును ననునవి కావ్యదోషంబులు, కవులష్టవిధములు కలవారు. మనఃప్రసాదమును గళాకౌశలంబున సుఖముగఁ జతుర్వర్గముం దెలియుటయు సంసారంబునం గీర్తియుఁ గవిసంగ్రహమునకు ఫలంబులు. ఆలాపశుద్ధియు మాధుర్యంబును బ్రయోగవైదగ్ధ్యంబును మార్దవంబును సమమగునందును దనువుం బులకితముం జేయుటయు, రాగాంతర సాంకర్యాభావంబును గృహీతరాగనిర్వాహంబును మనోరంజకత్వము ననునవి సంగీతలక్షణములు, సమత్వము మవాలయములో గలియుటయు, గాయకభావము ననుసరించుటయు, మార్దవంబును వ్యక్తయతి ప్రయోగంబును, శ్రుతిమధురత్వంబు ననునవి వాద్యగుణంబులు, మా

ఖునందును నభినయమునందును నృత్యంబునందును, సమమగు సమాయోగంబును, సంగీతము ననుసరించుటయు, మృదువగు నభినయంబును రసోచితమగు హావభావములు గన్పడుటయు నృత్యలక్షణములు. దుర్మార్గుల ప్రస్తావనయందును నెవ్వఁడు దుర్వచనముఁ బలుకఁడో వాఁడు మహాత్ముఁడు. ఎవని యింటికిఁ బోయి యతిథులు కృతార్థులుగాకుండ మరలుదురో వాఁడు నిర్భాగ్యగృహస్థుండు. ఋణగ్రహణమున ధర్మంబును సుఖంబును లేదు. ద్రవ్యము యాచకులకిచ్చినఁ దఱుగును గాని విద్యతరుగదు. దాత ఋణమిచ్చినచో వానికిఁ బరితాప మత్యాసన్నమై యుంటయుఁ గలవాఁడును బరాభవంబున నిచ్చినద్రవ్యము మరల రాకుండుటయుఁ దటస్థించును, దాత గానివాఁడు మరలఁ దనయిచ్చిన ద్రవ్యము వచ్చువరకును స్నేహమును సౌజన్యంబును బ్రియభాషణంబును సామీప్యంబును విడువఁడు. ఏ అసత్యమువలనఁ బరోపకారంబును స్వార్థలాభంబును లేదో యది యసత్యము కాదు. నాస్తికున కన్నింటను నసత్యమువలని భీతిలేదు, ద్రవ్యము కొరకుఁ దల్లినైనను జంపుటకు వెనుదీయఁడు. అసత్యమునకుఁ జంకఁడు, వివాహముకంటె సకలానర్థ నిదానము మఱొకటిలేదు గాని వధూవర నిర్వాహము మాత్రము దైవాయత్తము. రతికాలంబునఁ బలుకఁదగరానిమాటలులేవు, ఒకటియు జరుగనదికాదు, గాని యంతమాత్రమున దంపతుల ప్రీతి చెడదు. ప్రీతిసామ్యము గాని కలహము గాని రతికైతవము గాని యున్నచో దంపతులయనురాగము చెడును. ఎప్పటికప్పుడు సంపాదించుకొను సైన్యముగల రాజునకు జయమెక్కుడిది. వాని ప్రాణార్థస్త్రీలయందుఁ గళ్యాణమెక్కుడిది కృతార్థులగుదనుక వంశమును సందతియెడల విశయముఁ జూపుదురు. కూడజన్మించిన దేహమయినను జీవునితో వెంటరాదన్నచో నింక నన్యులు వత్తురా! అశుభమునకుఁ గాలహరణమే ప్రతీకారము. పక్వాన్నంబువలనం బలె స్త్రీలవలనను దేహతాపోపశాంతియే ప్రయోజనము. అనురాగ విరాగములేల. గడ్డిపోఁచతోనైనను బ్రయోజనమున్నప్పుడు దేహపాదధారియగు మానవునివలనఁ బ్రయోజనముండదా! ఎవరువ్రాసిన కమ్మనైనను మఱువరాదు. రాజునకు సమయము వచ్చినప్పుడవియే ప్రధానములు. సంధివిగ్రహాదివ్యాపారంబును సర్వజగద్వ్యాపారంబును దర్పణముగఁ జేయున్నది. నీతి విదులు పుష్పయుద్ధమునైన నంగీకరింపరు. శరయుద్ధము నంగీకరింతురా! పెక్కురను బోషించువాఁడే రాజు. అర్జునవృక్షము పండిననేమి! ఎండిననేమి. త్యాగి కల్పవృక్షమువలె సర్వసంబాధము సహించును. రాజులు పర్వతములవలె దూరసౌందర్యము గలవారు. నుప్రక్కులకు దేశవార్తలన్నియుఁ దెలియుఁదగు సాధనములున్నదేశములే రమణీయములు. ధనమును బంధువులను లేనివానికి మను

వ్యసంచారముగల దేశంబును మహారణ్యమువంటిది. శ్రీమంతున కరణ్యంబును రాజధానియే. ఆసన్నవినాశుండగు వానికి మతివిపర్యాసము కలుగును. పుణ్యవంతునకు దౌర్భాగ్యదశయే లేదు. అనుకూలదైవము విపదలను ద్రోఁచి సమస్తసంపదల నొసంగును. అసహనుండును విహీనుండును కృతఘ్నుండును దీర్ఘకోపియుఁ గర్మచండాలురు. ఔరసుఁడు క్షేత్రజుఁడు దత్తుఁడు కృత్రిముఁడు గూఢోత్పన్నుఁడు అపవిద్ధుఁడు నను నార్గురుపుత్రులును దాయాదులు పిండదానంబునకు యోగ్యులు. కానీనుఁడు సహోఢుఁడు క్రీతుఁడు పౌనర్భవుఁడు స్వయందత్తుఁడు శౌద్రుఁడు నను నార్గురును దాయాదులు కారు. పిండదానంబునకుం దగరు. కొన్ని దేశములందుఁ గొన్ని కులములందు దాయభాగప్రాప్తి స్త్రీసంతానమునకు గలదు. యతికులమున శిష్యులకే కాని తనూజులకు లేదు. అత్యుపచయము కలవాఁ డెవ్వని కవమానము సేయఁడు. భృత్యావరోధము రాజు నేదండించుటవంటిది. రతికాలంబునను మంత్రానుష్ఠానసమయంబును హోమము సేయుతఱిని భోజనము సేయువేళను నెవ్వనిని నెవ్వఁడును సమీపింపరాదు. ఎంతపరిచయమున్నను జంతులయందైన విశ్వాసముంచరాదు. మత్తదంతి నెక్కినఁ బ్రాణాపాయము వచ్చును. అతివినోదమంగభంగముఁ గావింపక తీరదు. ఆస్తి లేనివాని ఋణమును బరిచర్య చేయించుకొని తీర్చుకొనవలెను. యతులయెడను బ్రాహ్మణులయెడను క్షత్రియులయెడను పూర్వోక్తవిధి తగదు. అశనము నెడలను శయనము నెడలను యథాలాభసంతుష్టి లేనివానికిఁ దనయాత్మయే వైరి. మహామునివలె సర్వాన్నములు తినుచు సర్వక్లేశము లనుభవించుచు సర్వప్రదేశములందు శయనించువాని కసాధ్యమగునది లేదు. ఆడుదానియనురాగమువలె సంపద యెవ్వరికిని స్థిరము కాదు. అన్యులమీఁది తంత్రములు చెప్పువారు రాజులకు ప్రాయముగ నిష్టులగుచుందురు. నీచుఁడు పరనిందచే స్వోత్కర్షఁ గాఁ దలఁచును. అల్పత్వబృహత్త్వములు గుణమువలనం దెలియఁదగుఁ గాని పదార్థప్రమాణమువలనఁ దెలియవు. కలుషమనీషులు నిర్నిమిత్తముగా మహాత్ములుగారు. ప్రకృతిచే శీతలమగు జలము సైతముష్ణమగుట వహ్నిప్రభావము. చిరకాలస్థాయియైనను గార్యార్థి లెస్సఁగా నారాధింపవలెను. కాని యర్థికవ్యవహారముం జేయరాదు. శుభాశుభకర్మములు రెండును సత్పురుష పురస్సరముగాఁ జేయువానికి నాపదలును నపవాదలును రావు. సంపదలలో సంపదలును విపదలలో విపత్తులును వచ్చుచుండును. దుష్టాధికారియుఁ గార్యాధికారియుఁ బరసంబాధమును విచారింపడు. శాస్త్రవేత్తలును స్త్రీలును ననుభూతగుణులై పరమాత్మను రంజింపఁజేయుదురుగాని ప్రసిద్ధిలో వాటికిఁ బని లేదు. చిత్రగతుండగు రాజుంగూడ దిరస్కరింపరాదు. క్షత్రియతేజము గొప్ప ఘనదేవత. యనఁద

# శ్రీసరస్వతీకార్యస్థానమున వెలకుదొరకుపుస్తకములు.

| | రు. | అ. | ప. | | రు. | అ. | ప. |
|---|---|---|---|---|---|---|---|
| మార్కండేయపురాణము | 1 | 4 | 0 | సువర్ణశృంఖల | 0 | 8 | 0 |
| కళాపూర్ణోదయము | 1 | 0 | 0 | కాంచనమాల | 0 | 8 | 0 |
| బాలరామాయణము | 1 | 0 | 0 | విక్రమాంకదేవచరిత్రము | 0 | 8 | 0 |
| రాజతరంగిణి 1-2 భాగములు | 1 | 0 | 0 | చంద్రప్రభచరిత్రము | 0 | 8 | 0 |
| కేయూరబాహుచరిత్రము | 0 | 6 | 0 | షేక్స్పియరునాటక కథాసారము | 0 | 12 | 0 |
| శుకసప్తతి | 0 | 14 | 0 | ఫసానే అజాయబ్ | 0 | 8 | 0 |
| హరవిలాసము | 0 | 8 | 0 | శ్రీశివాజీచరిత్రము | 0 | 10 | 0 |
| శకుంతలాపరిణయము | 0 | 8 | 0 | నన్నయభట్టారక చరిత్రము | 0 | 8 | 0 |
| నిరంకుశోపాఖ్యానము | 0 | 6 | 0 | పరమానంద చరిత్రము | 0 | 4 | 0 |
| విజయవిలాసము | 0 | 6 | 0 | అమీరేహంజా | 0 | 8 | 0 |
| అపవాదతరంగిణి | 0 | 6 | 0 | భువనమోహిని | 0 | 4 | 0 |
| బహులాశ్వచరిత్రము | 0 | 6 | 0 | హరిశ్చంద్రమహారాజుకథ | 0 | 4 | 0 |
| కువలయాశ్వచరిత్రము | 0 | 8 | 0 | సాహసిక కన్యకము | 0 | 6 | 0 |
| శృంగారశాకుంతలము | 0 | 8 | 0 | ఆనంద సాగరము | 0 | 6 | 0 |
| పార్వతీపరిణయము | 0 | 8 | 0 | [illegible] చరిత్రము | 0 | 6 | 0 |
| కురుక్షేత్రవిజయము | 0 | 8 | 0 | కారొనేషన్ సంచిక | 0 | 6 | 0 |
| త్రిలోకసుందరి | 0 | 8 | 0 | [illegible] | 0 | 8 | 0 |
| ఎడ్వర్డుపట్టాభిషేకనాటకము | 0 | 6 | 0 | గుణమంజరి | 0 | 6 | 0 |
| చంద్రహాస నాటకము | 0 | 12 | 0 | వీరబలవినోదములు | 0 | 6 | 0 |
| కన్యకాపరమేశ్వరినాటకము | 0 | 6 | 0 | శుక్రనీతిసారము | 0 | 10 | 0 |
| మృచ్ఛకటికము | 0 | 12 | 0 | కళావిలాసము | 0 | [illegible] | 0 |
| ముద్రారాక్షసనాటకము | 0 | 8 | 0 | శ్రీనాథచారిత్రము | 0 | 4 | 0 |
| మాలతీమాధవము | 0 | 8 | 0 | కన్యాశుల్కము. | 0 | 12 | 0 |
| మల్లికామారుతప్రకరణము | 0 | 14 | 0 | వివేకానందోపన్యాసములు. | 0 | 10 | 0 |

ఇంకా యితరగ్రంథములు చాలగలవు.

కేటలాగుకు వ్రాసినయెడల నుచితముగా పంపుదుము.

కావలసినవారు

సరస్వతీ మేనేజరు, కాకినాడ, అనివార్యుపలెను.

